# శ్రీగిరి మల్లికార్జున శతకము

ప్రార్థన:

శ్రీశైలాద్భుత తుంగ శృంగ విలసత్ సింహాసనాధిష్టితా
రాశీభూత సమస్త యోగ పరమార్థా! భ్రామరీనాథ! నీ
యాశీర్వాద మహా ప్రసాద ఫలితమ్మో శాశ్వతానంద మి
మ్మో శర్వా! నిగమాగమాది వినుతా! ఓంకార నాదాత్మకా!

శ్రీమాతా! భ్రమరాంబికా! త్రిభువన శ్రేయోనుసంధాయినీ!
శ్రీమల్లీశ హృదబ్జ వాసిని! లసత్ స్మేరాననా! శంకరీ!
సోమార్కానల లోచనా! తలతు నిన్ శుద్ధాంతరంగమ్మునన్
ప్రేమానంద రసప్రవాహిని! ననున్ వీక్షింపుమా సత్కృపన్

శ్రీ విఘ్నేశ్వర! సర్వ భక్త గణ సాక్షీ! సిద్ధి బుద్ధి ప్రదా!
దేవేశా! ప్రథమార్చితా! మునినుతా! దివ్యత్కృపా వైభవా!
శ్రీవిద్యాది సమస్త యోగతతికై సేవింతు లంబోదరా!
భావాతీత విలాస భాసుర! ననున్ పాలింపుమా సత్కృపన్

అంకితము:

అంబను గూడి శైల శిఖరాగ్ర సమంచితవేది, నేత్ర ప
ర్వంబగు రీతి తాళ లయ బద్ధ పద క్రమ తాండవంబు, మో
దంబున జేయుచుండి ప్రమథ వ్రజ సేవల నందు నీకు ప
ద్యంబుల నంకితం బిడుదు సాదృతి శ్రీగిరి మల్లికార్జునా!

ఓమ్మను నాద మాద్యముగ నో పరమేశ! "నమశ్శివాయ" మం
త్రమ్ము సమస్త పాప హరణమ్ము, భవాంబుధి తారణమ్ము, ని
త్యమ్ము జపింతు భక్తి మెయి ధ్యానము నందున నొప్పు నీదు త
త్త్వమ్ము శుభప్రదమ్ము ప్రమథస్తుత! శ్రీగిరి మల్లికార్జునా! 1.

నతుల నొనర్తు నీదు చరణమ్ముల సన్నిధి నీదు వైభవో
న్నతులకు బొంగుచున్ మనము నందు జపింతు "నమశ్శివాయ" నా
నతుల పవిత్ర మంత్రము నిరంతరమున్ భవ భావనాంచితో
న్నతుల జెలంగ గోరుదును నా మది శ్రీగిరి మల్లికార్జునా! 2.

మహిమలు పెక్కులెన్నదరమా నను బోంట్లకు నో వికుంఠధా
మహిత! "నమశ్శివాయ" యను మంత్రము పల్కుచు నిన్ను గొల్చెదన్
మహిత గిరీంద్రవాస! కనుమా కరుణారస ముల్లసిల్ల మ
మ్మహివర భూషణా! త్రిభువనాధిప! శ్రీగిరి మల్లికార్జునా! 3.

శివ శివ యంచు నే స్మరణ జేయుదు నీ శుభ నామ మెన్నడున్
శివ శివ యంచు నే స్తవము జేయుదు నీ విభవోన్నతుల్ మదిన్
శివ శివ యంచు నే జపము జేయుదు నాత్మ "నమశ్శివాయ" మం
త్రవిధి నొనర్తు ధ్యానము సదా శివ శ్రీగిరి మల్లికార్జునా! 4.

వాసవ ముఖ్య దేవగణ వందిత కీర్తియుతా! జగత్త్రయీ
వాస! "నమశ్శివాయ" యను పావన మంత్రము నాకు రక్ష, సా
వాసము శైవ బృందమున, పావన భావన! నీ పదమ్మె ఆ
వాసము గాగ వేడుదు శుభంకర! శ్రీగిరి మల్లికార్జునా! 5.

యక్ష ధనేశ కిన్నర సురాసుర కింపురుషాదులెల్ల నీ
యక్షర రక్ష గోరరె మహాత్మ! జపమ్ము "నమశ్శివాయ" యే
యక్షయ భూతి నా కొసగు నంచును నమ్మి యొనర్తు నిట్టులా
యక్షర పంచకమ్మునె దయాపర! శ్రీగిరి మల్లికార్జునా! 6.

తలచెద భక్తి భావమున ద్వాదశ లింగములన్ ద్వితీయమై
వెలసియు నద్వితీయమయి వెల్గెడు తావక తత్త్వ వైభవ
మ్ములను "నమశ్శివాయ" యని మ్రొక్కుచు మంత్ర జపమ్మొనర్తు ని
ర్మల హృదయమ్మునన్ సుజన రంజన శ్రీగిరి మల్లికార్జునా! 7.

తలచెద భక్తి భావమున తావక సత్కరుణా విలాస రీ
తులను "నమశ్శివాయ" యని దోసిలి బట్టి త్వదీయ పాద సే
వలకు నుపక్రమింతు, వృషవాహన జన్మజరాది సర్వ బా

ధల తొలగింపుమయ్య! వరదాయక! శ్రీగిరి మల్లికార్జునా! 8.

తలచెద భక్తి భావమున తావక సన్మహిమా విశేష గా
థలను "నమశ్శివాయ" యని త్ర్యంబక! మంత్ర జపమ్మొనర్తు, ని
శ్చల హృదయాంతరాళమున, శాశ్వత మోక్షపద మ్మొసంగు మో
నలినహితేందు వహ్నినయనా! శివ! శ్రీగిరి మల్లికార్జునా! 9.

తలచెద భక్తి భావమున త్ర్యక్ష! నినున్ భ్రమరాంబికేశు, ని
చ్చలును "నమశ్శివాయ" యని స్వాంతమునందు జపించు చుందు నా
కలమున నీదు లీలలను కమ్మని రీతి రచింపజేయుమా!
జలజ భవేంద్ర ముఖ్య దివిజస్తుత! శ్రీగిరి మల్లికార్జునా! 10.

తలచెద భక్తి భావమున దాసజన ప్రియ! దేవ! నిన్ను, సత్
ఫలద! "నమశ్శివాయ" యను పావన మంత్ర జపమ్మొనర్తు ని
ర్మల హృదయాన, దేవగణ రంజన! రాక్షస భంజనా! సము
జ్జ్వల శుభగాత్ర! మౌనిజన సన్నుత! శ్రీగిరి మల్లికార్జునా! 11.

భవ! భవభీతి నాశకర! భక్త మనోంబుజ వాస! సత్కృపా
ర్ణవ! నవ భక్తి మార్గముల నాగవిభూషణ! కొల్తు, పార్వతీ
ధవ! ధవళ ప్రభాకర! సుధాకర శేఖర! దీనబాంధవా!
శివ! శివ! నీ పదాబ్జములు చేరుదు శ్రీగిరి మల్లికార్జునా! 12.

నీ యనురాగవల్లి రమణీమణి మామక కల్పవల్లి, ప
ద్మాయతనేత్ర, తల్లి భ్రమరాంబను, చేరి పదాబ్జ సన్నిధిన్
చేయుచు వందనమ్ములు, భజించెద మానసమందు వేడుచున్
శ్రేయము గూర్పుమంచు పలురీతులు శ్రీగిరి మల్లికార్జునా! 13.

తల్లికి తండ్రికాదృతి ప్రదక్శిణ చేయుచు ముజ్జగాలలో
నెల్ల పవిత్ర తీర్థముల నిమ్ముఅ తమ్ముని కంటె ముందె వ
ర్తిల్లుచు సిద్ధి బుద్ధి గని తేజముతో వెలుగొందు వేలుపున్
చల్లని తండ్రి గొల్తును ప్రసన్నుని శ్రీగిరి మల్లికార్జునా! 14.

ముద్దుగ మోములున్ గలుగు మోహన మూర్తి మయూరవాహనున్
దద్దయు శక్తి యుక్తులను తారకు దృంచిన కార్తికేయు, మీ
ముద్దుల పట్టి విక్రమ విభూషణు నిర్జరలోక వందితున్
హద్దులు లేని భక్తి కొని యాడుదు శ్రీగిరి మల్లికార్జునా! 15.

చెంతనె నిల్చి సంతతము సేవలొనర్చెడు భక్తపుంగవుం
డెంతటి పుణ్యశాలియొ? గవీశుడు మీ ప్రియ వాహనమ్ము, మీ
కెంతటి ప్రీతి పాత్రుడో? కవీశ్వర సంస్తవనీయ శీలు మత్

స్వాంతము నన్ స్మరింతు గిరిజాప్రియ! శ్రీగిరి మల్లికార్జునా! 16.

వాసికి నెక్కె శ్రీనగము భ్రామరి నాయక నీకు నంబకు
ల్లాసము గూర్చు సర్వ శుభ లక్షణ లక్షితమై ధరిత్రి కై
లాసమునై పవిత్ర శిఖర ప్రకరమ్ములు గల్గి సంసృతి
త్రాస వినాశకమ్మునయి త్ర్యంబక! శ్రీగిరి మల్లికార్జునా! 17.

నాదు మనస్సరోవరమునన్ విలసిల్లు సుమాలు జ్ఞానచం
ద్రోదయ వేళ సొంపెసగు నుత్పలమాలలు గూర్చి సేర్చి నే
సాదర రీతి నీ కొసగి సన్నుతి జేయుదు నెమ్మనమ్మునన్
మోదముతోడ శర్వ! నను బ్రోవుము శ్రీగిరి మల్లికార్జునా! 18.

శివ! శివ! నీదు కీర్తనలు జేయుచు భావ పథాన నేగి నా
కవనము నందు నీ కొరకు కమ్మని చంపకమాల లల్లుదున్
భవ! భవ! నా ప్రయత్నము కృపన్ సఫల మ్మొనరింపు మంచు, నే
సవినయ రీతి వేడుదును శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 19.

తొలుతను బూనుకొంటి మది స్తోత్రము లిమ్ముగ జేయ నీకు, నే
తలచిన యంతలో నెడద తట్టెను భావ పరంపరల్ వడిన్
కలమును పూని యీ శతక కల్పనలన్ భవదీయ సత్కృపా
ఫలముగ చేయుచుంటి సమభావన! శ్రీగిరి మల్లికార్జునా! 20.

జగములు సృష్టి సేయు జలజాత సముద్భవమూర్తి వీవె, ఆ
జగముల నేలుచుండు జలజాత దళాక్షుడ వీవె, దేవ! ఆ
జగముల నెల్ల లోగొను ప్రచండ లయంకర మూర్తి వీవె, ఓ
జగదధి నాథ! నీ భజన సల్పెద శ్రీగిరి మల్లికార్జునా! 21.

పరమ పవిత్ర భక్తిరస వాహిని మామక మానసాఖ్యయౌ
సరసి సముద్భవించి తతశాంత తరంగిణియై హరోం హరోం
హరయను నాద యుక్తముగ నాడుచు పాడుచు నో కృపాబ్ధి! నీ
చరణములంటి ధన్య యయె సమ్మతి! శ్రీగిరి మల్లికార్జునా! 22.

చిత్తము నిన్ను గోరుచును సేవలు నీ కొనరించు వేడ్క ను
ద్వేత్తున పొంగుచుండగ ననేక విధాల నొనర్తు స్తోత్రముల్
బత్తి నెలంగ నీ పయి నపార కృపామతి! బ్రోవుమయ్య! దే
వోత్తమ! నన్ గృపావిభవ మొప్పగ శ్రీగిరి మల్లికార్జునా! 23.

మొలిచెను భక్తి భావమను ముచ్చట గొల్పెడు వన్నె వన్నె తీ
గలు మును నా మదిన్ పెరిగి క్రన్నన పూవులు, పండ్లతో విరా
జిలె భవదీయ సత్కరుణ చేర్పుము నీ దరి నా సుమాలతో

గొలిచెద నీ పదాబ్జములు కూరిమి శ్రీగిరి మల్లికార్జునా! 24.

పాండితి లేదు నీ యెడల బత్తి యొకించుక తప్ప నాకు, నో
అండజవాహనాది దివిజార్చిత పావన పాదయుగ్మ! నీ
యండను జేరి పద్యముల నల్ల దొడంగితి, నీదు ప్రేమ లే
కుండిన నేమి చేయ గలనో? శివ! శ్రీగిరి మల్లికార్జునా! 25.

శక్తినొసంగ నీ చరణ సన్నిధి చేరి యొనర్తు సేవలన్
రక్తిని గల్గ జేసిన నిరంతర మల్లెద సత్కవిత్వమున్
భక్తిని పెల్గ జేసిన శుభంకర! వీడను నిన్ను, నిత్యమౌ
ముక్తి నొసంగుమయ్య! సురపూజిత! శ్రీగిరి మల్లికార్జునా! 26.

కలియుగ మందు జీవులకు కల్గును మోక్షము భక్తితో నినున్
దలచిన యంతనే యనుచు నమ్మి నిరంతరమున్ మనమ్మునన్
దలచుచునుందు నిన్ను, భవనాశకరా! జగదీశ! నన్ను ని
చ్చలు కృప జూడుమా! ప్రమథ సన్నుత! శ్రీగిరి మల్లికార్జునా! 27.

తొలగును భక్త కోటులకు దుఃఖము లీ భవమందు, నా పయిన్
కలుగవు జన్మ లెవ్వియును కన్నుల విందగు నీదు శైలమున్
కలనయినన్ గనుంగొనిన గల్గును శాశ్వత మోక్షమో శివా!
జలరుహ సంభవాది సుర సన్నుత! శ్రీగిరి మల్లికార్జునా! 28.

అల్లదె శ్రీ గిరీంద్రమని యందరు భక్తులు సంతసమ్ముతో
నుల్లము లెల్ల నూయెలల నూగగ సాగెదరంట, ఆదుకో
మల్లన! నీదు భక్తులము మా కభయమ్మిడి వేగ చేదుకో
మల్లన! నీదు సన్నిధిని మమ్మని శ్రీగిరి మల్లికార్జునా! 29.

మల్లన దేవ! ఆదుకొనుమా నను, మానను మానసమ్ము రం
జిల్లగ జేయు నీ చరణ చింతన, చింతల బాపి అంబికా
వల్లభ! ప్రోవుమా నను, కృపా కలశాంబుధి! సాంబ! నా పయిన్
చల్లని నీ కృపారసము జల్లుము శ్రీగిరి మల్లికార్జునా! 30.

కొల్లలు గాగ బంధములు కోరిక లొక్కట జుట్టు ముట్టి నా
యుల్లము నందు నిండి నను నుక్కిరి బిక్కిరి చేయుచుండగా
నెల్లెడలలందు రక్షకుడ వీవె యటంచును వేడుచుంటి నో
మల్లన దేవ! చేదుకొనుమా నను శ్రీగిరి మల్లికార్జునా! 31.

తల్లియు, తండ్రియున్, గురుడు, దైవము, మిత్రుల పోల్కులేల? వా
రెల్లర మించి సంతతము నిచ్చుచు నుందువు రక్ష నాకు, నా
యుల్లమునన్ వసించుచును నుత్తమ యోగము కూర్చుచుందువో

చల్లని తండ్రి! నిన్ గొలుతు శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 32.

నమ్ముచు గొల్తు నీదు చరణద్వయ దివ్య సరోరుహాలు, పా
నమ్ము నొనర్తు నీ మధుర నామ సుధారస ధారలాత్మ, గా
నమ్ము నొనర్తు నీ మహిమ నారద సన్నుత! సెమ్మనాన ధ్యా
నమ్ము నొనర్తు నిన్ను కరుణామయ! శ్రీగిరి మల్లికార్జునా! 33.

ఓమ్మను మంత్రమే యలరు నూహల కందక బ్రహ్మమై సదా
ఓమ్మను బీజమే తొలుత నొప్పు విశిష్టత గాంచు మంత్రముల్
ఓమ్మను నాదమే కతము ఉద్భవ పాలన నాశనాలకున్
ఓమ్మను తత్త్వమందలరు చుందువు శ్రీగిరి మల్లికార్జునా! 34.

కమలహితేందు వహ్నులకు కాంతుల గూర్చెడు వాడవీవె, వి
శ్వమున మహాంధకారముల బాపెడు వాడవునేని, నీవె, జ్ఞా
నమునకు మూర్తివీవని మనమ్మున గొల్తును నిన్ను నాదు నే
త్రములకు నేత్రమీవె కద త్ర్యంబక శ్రీగిరి మల్లికార్జునా! 35.

దినకరుడిందు డగ్నియును తేజముతో వెలుగొందుచున్ జగ
మ్మున గల యంధకారములు బోవనొనర్తురు, కాని మన్మన
మ్మున గల చిమ్మచీకటులు బోవగ, ద్రోయగలారె? ఫాలలో
చన! శివ! నీవుగాక గిరిజాప్రియ! శ్రీగిరి మల్లికార్జునా! 36.

భారతి వీణ మీటి కలుపన్ శ్రుతి, తాళము గూర్ప బ్రహ్మ, పా
కారి యొనర్ప వేణురవ, మచ్యుతు డింపుగ మ్రోయ మద్దెలన్
గౌరిని గూడి తాండవము కన్నుల విందుగ జేసితయ్య, దై
త్యారి గణార్చితా! కొలిచెదన్ నిను శ్రీగిరి మల్లికార్జునా! 37.

వీడను భక్తి భావమును, విజ్ఞత నిమ్మని తప్పు, నిన్ను నే
వేడను భౌతికార్థముల  పెక్కు లొసంగుమటంచు, నేను నీ
వాడను, నీ పదాల కడ వ్రాలి యొనర్తును వందనాలు, నీ
నీడనె నే జరింతు కద నెమ్మది శ్రీగిరి మల్లికార్జునా! 38.

పలువురి మేలు కోరెడు శుభప్రదమైన ప్రవర్తనమ్ము, తే
నెల నొలికించు మాటలును, నీ పయి సంతత భక్తి భావమున్
తలపుల ముక్తిదంబయిన తత్త్వ విచారణ మెల్ల వేళలన్
గలుగగ నిమ్ము నాకు శితికంధర! శ్రీగిరి మల్లికార్జునా! 39.

ఇచ్చటి శైల శృంగములు, నిచ్చటి వాహినులున్ సరోవరా
లిచ్చటి పుష్ప వాటికలు, నిచ్చటి సుందర మందిరాంగణా
లిచ్చటి క్షేత్ర వైభవము లెచ్చట నేనియు గాంచవచ్చునే?

యిచ్చట కాక ముచ్చటగ నీశ్వర! శ్రీగిరి మల్లికార్జునా! 40.

ఏలికవౌచు లోకముల నెల్లను శక్తి సమన్వితుండవై
లీలగ నీవె మోయగ, భరించును మిమ్ము నిరంతరంబు ధీ
శాలి గవీశ్వరుండు, నిను సమ్మతి గొల్చిన భక్త కోటికిన్
తేలికగా లభింతువని తెల్పగ, శ్రీగిరి మల్లికార్జునా! 41.

తోటలలో జెలంగుచును తుమ్మెదలెల్లను నీ విలాసమున్
మాటికి మాటికిన్ పలుకు మత్తున దేలుచు, భక్తి లీల నా
నాటికి నీకు చేరువయి నాదమె బ్రహ్మమటంచు జ్ఞానమున్
చాటు మహాద్భుతమ్మనగ శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 42.

విందగు నాదు కన్నులకు ప్రేమమయంబగు నీ స్వరూపమే
విందగు నీ చరిత్రములె వీనులకున్, చదువంగ భక్తితో
విందగు నీదు కీర్తనలె వేద వినోదన! నాదు జిహ్వ కో
యిందు కళాధరా! త్రిజగదీశ్వర! శ్రీగిరి మల్లికార్జునా! 43.

అమరెను గంగ నీదు జడలందున, మూర్ధము పైని భూషయై
హిమ కిరణుండు, కంఠమున నిమ్ముగ వాసుకి, దేవ! అట్టి భా
గ్యములను కోరనేను, భవదంఘ్రి సరోరుహ సేవనీయ భా
గ్యముగ నెరింగి చేయుదు దయామయ! శ్రీగిరి మల్లికార్జునా! 44.

భక్తులలో మెలంగుటయె భాగ్యము నాకు నిరంతరంబు, నీ
భక్తి మదీయ చిత్తమున భాసిలు టెంతయు భాగ్యమే కదా!
భక్తవరప్రదా! పరమ భాగ్యము నీ కృప నేను బొందుటే,
ముక్తి పదమ్ము నా కొసగి ప్రోవుము శ్రీగిరి మల్లికార్జునా! 45.

పూవిలుకాడు నీ యెదుట బూడిద యయ్యెడు నంత భీతితో
దేవతలెల్ల జేరి నిను దీన దయాపరు వేడగా పున
ర్జీవితు జేసినాడవట చిత్తభవున్ కరుణార్ద్ర దృష్టితో
తావక లీల లిట్లెకద త్ర్యంబక! శ్రీగిరి మల్లికార్జునా! 46.

బోయడు తిన్నెడిచ్చెనట పుక్కిట పట్టిన నీళ్ళు, మాంసమున్
బాయని భక్తితో, నతని భక్తికి మెచ్చితివంట, ప్రీతితో
బోయని కిచ్చి నాడవట మోక్షపదంబును, భక్తికోటికిన్
శ్రేయము గూర్చు నీ భజన చేసెద శ్రీగిరి మల్లికార్జునా! 47.

నిలకడ లేనిదీ మనము నిన్ను స్మరించెడు వేళనైన చం
చలమయి లౌకికంబులగు సంగతులన్నిట చొచ్చు గాన, ని
శ్చల మొనరింపగా దగిన సాధన మిచ్చితి వేని నీదు సే

వల నొనరింతు నిత్యము శుభంకర! శ్రీగిరి మల్లికార్జునా! 48.

సురనది కేశపాశమున సొంపుగ నూగిస లాడగా, సుధా
కరుడు చలించుచుండగ ధగద్ధగ దీప్తుల జిమ్ముచుండి, కం
ధరమున నాడు చుండ ఫణి, తాండవకేళి నొనర్చు నట్టి సుం
దర నటరాజ! నిన్ గొలిచెదన్ మది శ్రీగిరి మల్లికార్జునా! 49.

హర! హర! లింగ రూపమున కాదియు నంతమెరుంగ బ్రహ్మయున్
హరియును బోయి చేరిరి దిగంతములన్ చెరి యొక్క వంక, న
ట్లరిగియు గాంచలేక పెరగంది ప్రయత్నము మానుకొంటి ర
బ్బురము గదయ్య! నీ మహిమమున్ విన శ్రీగిరి మల్లికార్జునా! 50.

రావణు డెత్తగా హిమ ధరాధర రాజము దుర్మదాన తద్
భావ మెరింగి యద్రి నడుపన్ జవసత్త్వములున్ నశించి యో
దేవ! శరణ్యమీవె యని దీనతతో నిను వేడ జేసితో
పావన భావనా! భవ! కృపాకర! శ్రీగిరి మల్లికార్జునా! 51.

ఆపదలందు నీ పదములంటి భజింతురు పే విధాలలో
నాపద లెల్ల తీర కలనైనను నిన్ను స్మరింప సెంచరో
హో! పరిపాటి యింతె గద! యుర్విని మానవ కోటి సెంచగా
పాప వినాశకా! శివ! శుభంకర! శ్రీగిరి మల్లికార్జునా! 52.

చిల్లర రాళ్ళ కన్నిటికి చేతుల సెత్తుచు మ్రొక్కుచున్నచో
చెల్లును కాలమంతయును జీవిత మంతయు వ్యర్థమౌను, భా
సిల్లెడు యోగ సాధనల చేయుచు మోక్ష పదమ్మె లక్ష్యమం
చెల్లరు చేరుటొప్పగు మహేశ్వర! శ్రీగిరి మల్లికార్జునా! 53.

ఉరగము పూల మాల వలె నొప్పుచు నిన్ను నలంకరింపదే?
గరళము నీ గళమ్మునను క్రాలదె? లీలగ, నిన్ భజింప సు
స్థిరమయి మానసమ్మును ధృతిన్ వెలుగొందదె? భక్త కోటికిన్
పరమ పదమ్ము గల్గదె? శుభంకర! శ్రీగిరి మల్లికార్జునా! 54.

మానవ జన్మముత్తమము క్ష్మాతలమందలి ప్రాణులన్నిటన్,
జ్ఞానమునొంది సద్గతుల సాధన జేయగ నేర్చు మర్త్యుడే
గాన లభించినట్టి యవకాశము వ్యర్థము చేయకుండుటెం
తేనియు భద్ర మండ్రు పరమేశ్వర! శ్రీగిరి మల్లికార్జునా! 55.

భ్రమలు జనించు రజ్జువొక పామని, ముత్తెపు జిప్ప పెండియం
చు, మెరయు గాజు రత్నమని, శోధన చేశిన ధీరమానసుల్
భ్రమలు తొలంగు నట్లె గన వచ్చును మాయను దాటుకొంచు బ్ర

హ్మమును విశుద్ధ చిత్తమున నంతట శ్రీగిరి మల్లికార్జునా! 56.

ఆయువు నూరు వత్సరములందురు కాని మనుష్య కోటికే
ప్రాయమునందు నుండినను వచ్చును మృత్యువు గాన ప్రాజ్ఞులై
మాయల నెల్ల ద్రుంచుచును మంచిని పెంచుచు యోగ సాధనో
పాయము చేత జేరవలె బ్రహ్మము, శ్రీగిరి మల్లికార్జునా! 57.

బురదను పుట్టి తామరసముల్ పలు సొంపుల నింపు నింపుతో
నురగ శిరమ్ముపై నలరు నొప్పుగ సన్మణి గారు చీకటిన్
గరము వెలుంగు రత్నమును కాంతులతో భువి మాయలందు సత్
పురుషులు నిట్లె వెల్గెదరు భూతిని శ్రీగిరి మల్లికార్జునా! 58.

ఇప్పటినుండి యోగపథ మేల? తలంప వయస్సు మళ్ళుచో
నొప్పుగ జేయవచ్చునని యూరక యుండగ రాదు, భూమిపై
ముప్పులు చెప్పి రావు కద, ముక్తికి సాధన లెల్ల వేళలన్
తప్పక చేయుచుండుటయె ధర్మము శ్రీగిరి మల్లికార్జునా! 59.

రక్షలు పెక్కు భంగులయి లభ్యమగున్, వినియోగమౌ, జగ
ద్రక్షక! నీ కటాక్షమున ధాత్రిని సజ్జన కోటికిన్, లలా
టాక్ష! నినున్ భజించునెడ నాపదలెల్లను బాయునొక్కటన్
రక్షల కీవె రక్షవు పరాత్పర! శ్రీగిరి మల్లికార్జునా! 60.

ఎరుగను లక్ష్యమున్, దెరువు, నేర్పడ నా కెరిగించి, నిక్కమౌ
వెరవును దెల్పి బ్రోవుమని వేయి విధమ్ముల వేడుచుంటి, నీ
చరణ సరోజ సన్నిధిని సాగిలి నేను నమస్కరింతు, సా
దరమున నెల్లవేళలను త్ర్యంబక! శ్రీగిరి మల్లికార్జునా! 61.

ధనము గడించ వచ్చునట, దాచగవచ్చు, నొసంగవచ్చు కొ
మ్మని, యది కాదు దుష్కరము, మానవ కోటికి ముక్తి నొందు సా
ధనములు దుష్కరమ్ములు కదా మది వేడుదు నిన్ను ముక్తి ని
మ్మనుచును నాకు సత్వరము త్ర్యంబక! శ్రీగిరి మల్లికార్జునా! 62.

ఇతరు లెరుంగగా గలరె ఎందును నీ మహిమంబులన్ గుణో
న్నతులగు వారు నిర్మల మనమ్మున నిన్ను భజించి నీ కృపా
మృతమును బొంది గాక, పరమేశ్వర! భాగవతోత్తముల్ పురా
కృత సుకృతాన గాక, భ్రమరీ ప్రియ! శ్రీగిరి మల్లికార్జునా! 63.

కొండలపై వసించుచును కోనల లోపల సంచరించుచున్
కొండలరేని పుత్రి సుమ కోమలి నిన్ను వరించి కూర్మితో
పెండిలి యాడెనంట మును వేలుపులెల్లరు మోదమంద ఆ

పండ్ ఉవు దేవ! మా కనుల పండువు శ్రీగిరి మల్లికార్జునా! 64.

సుమవనమందు పూపొదల జూచుచు నుండగ నేను భక్తి భా
వమున సుమాల లోన కనుపట్టె మహాద్భుతమైన రీతి నీ
సుమహిత రూప వైభవము చూచి మనమ్ము ప్రదీప్తమయ్యె నో
భ్రమర మనోహరా! శశికళాధర! శ్రీగిరి మల్లికార్జునా! 65.

మాయ జగమ్ములెల్ల యణుమాత్రము వీడక క్రమ్మియుండు, నీ
కాయములున్ కుటుంబములు కావు స్థిరమ్ములు రేపుమాపులో
మాయునటంచెరింగియును మాయను వీడరు పామరుల్ మదిన్
జేయరు నీ పదాంబురుహ చింతన శ్రీగిరి మల్లికార్జునా! 66.

తలపులు పల్కులున్, పనులు తద్దయు నీ పయి భక్తి నిల్పి, చిం
తలు నితరంబు లేవియు మనమ్మున నుంచక నొప్పునట్టి భ
క్తుల కృపతోడ బ్రోచుచును తోడుగ నుండెద విందునందు, నిన్
దలచెద భక్తి భావమున నామది శ్రీగిరి మల్లికార్జునా! 67.

నిరుపమ భక్తి భావమున నిత్యము సేవలొనర్చు చుండి చె
చ్చెర శివ సన్నిధానమును జేరెను కాళము, హస్తి, లూతయున్
సురవరసన్నుతా! నిను విశుద్ధ మనమ్మున గొల్చుచో నిరం
తరమును సద్గతుల్ గనుట తథ్యము శ్రీగిరి మల్లికార్జునా! 68.

జ్ఞానపయోధి వీవు శివ! నౌకగ భక్తి నొనర్చి చెన్నుగా
నేను తరంగ డోలికల నిత్యము నూయల లూగ గోరుచున్
మానసమందు నీదు స్మరణమ్ము నొనర్చుచు నున్నవాడ తం
డ్రీ! నను జేరనిమ్ము వడి నీదరి శ్రీగిరి మల్లికార్జునా! 69.

ఇరువది నాల్గు గంటలు మహేశ! దినమ్మున నుండ, నందులో
స్థిరముగ కొంత సేపయిన, చేరి భజింపరు నిన్ను నజ్ఞులై
నరులు వినోద రీతుల గనన్ తగ కాలము చాలకున్నదం
దురు నిను గొల్చుటెట్లులగునో కద శ్రీగిరి మల్లికార్జునా! 70.

ఏమి ప్రపంచమో కలుగ పెవ్వరికిన్ సుఖ శాంతులిచ్చటన్
లేములు, బాధ్యతల్, బరువులే పలురీతులు గల్గు కావునన్
ప్రేమయు, సత్యమున్, దయయు, విజ్ఞతయున్ గరవాయె నీపె మా
స్వామివి కావవే మము శుభంకర! శ్రీగిరి మల్లికార్జునా! 71.

లింగము రూపమై తనరు లీలయు, సౌమ్యము రూపు దాల్చ న
ర్ధాంగికి సార్థకత్వమిడు నద్భుత లీలయు, జుట్టుచుట్టలో
గంగను మోయు లీలయు జగమ్ముల గాంచె ప్రశస్తి స్థాణువౌ

జంగమ దేవరా! ప్రమథ సన్నుత! శ్రీగిరి మల్లికార్జునా! 72.

కాలు జయించినాడట మృకండు తనూజుడు నిన్ను గొల్చి, లో
కాలు జయించినాడు దశకంఠుడు, నీ కృపనొంది, జన్మ శో
కాలు జయించ గోరుదును కర్మ చయంబులు ద్రుంచవే! మహా
కాల! మహానటా! సుజన కల్పక! శ్రీగిరి మల్లికార్జునా! 73.

బలము తపోబలమ్ములను బాగుగ జూపగలేను పార్థునిన్
వలె, కుసుమాస్త్ర బోలికిని భంగమొనర్పగ నీ తపంబు సే
తలపను, నీ పదాబ్జముల ధ్యానము సేయుచునుండి నీదు వ
త్సలతను గోరువాడ గిరిజాప్రియ! శ్రీగిరి మల్లికార్జునా! 74.

తరుగుచునుండు నాయువది దాచుట కెందును వీలు చిక్కునే!
పెరుగుచునుండు బంధములు విశ్వమునందలి ప్రాణికోటికిన్
దిరుగుచు కాలచక్రమిదె తెల్పును సద్గతులొందు మంచు, నీ
శ్వరుని భజింప మేలనుచు, శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 75.

తలపులలో స్ఫురింప పరతత్త్వము దెల్పెడు భక్తి భావముల్
కలమును బూని నంతటనె కమ్మని పద్యము లేకధాటిగా
సలలిత రీతులన్ సులభ శైలిని సాగుచునుంట నీ కృపా
ఫలముగ నేనెరింగితి శుభంకర! శ్రీగిరి మల్లికార్జునా! 76.

వీడుదు ద్వేష రాగముల, వీడుదు నజ్ఞత, భేదభావముల్
వీడుదు, భోగభాగ్యముల విశ్వమునందలి బంధనమ్ములన్
వీడుదు దాంభికమ్ములన్ వీడుదు, నీదు పదాలు తక్క నే
వీడుదు నన్య చింతన భువిన్ శివ! శ్రీగిరి మల్లికార్జునా! 77.

గుమ్మము వద్ద కావలిగ కూర్చొని యుండిన జ్యేష్ఠరాజు మూ
ర్ధమ్మని ద్రుంచి యా పిదప దంతి శిరమ్మును జేర్చి నాడవం
చిమ్ముగ వింటి చిత్రముగదే పరికింపగ నట్టి నీ విలా
సమ్ము లెరుంగ మా తరమె? శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 78.

అంబను గూడి తాండవము నాడుచు నుండగ నుద్భవించె, నా
దంబులు సక్రమాన శ్రుతి తప్పక యా మధురాక్షరాలె, లో
కంబుల నెల్ల భాషలకు కారణమయ్యె జగద్ధితంబుగా
సాంబ శివా! భవా! విబుధ సన్నుత! శ్రీగిరి మల్లికార్జునా! 79.

మందుడు చూడకూడదని మాటున కోటరమందు దాగినా
వందురు, నీకు నైనను గ్రహంబుల బాధలు తప్ప వందురే
ఎందును విందుమే జగతి నింతటి వింతలు, లీల గాక, నీ

పెందుకు దాగినవొ? పరమేశ్వర! శ్రీగిరి మల్లికార్జునా! 80.

పాడుదు నీదు కీర్తనలు భక్తియుతమ్ముగ నెల్ల వేళలన్
వేడుదు నీ కృపారసము వేడుక తోడ నొసంగు మంచు,నే
వీడుదు నన్య చింతనలు, పెన్నిధి వీవె గదయ్య! మాకు, నీ
వాడను నేను, బ్రోవుము శివా! నను శ్రీగిరి మల్లికార్జునా! 81.

రాజు శిరస్సుమమ్ము, ఫణిరాజు గళావృత పుష్పమాల, గో
రాజధివాహనమ్ము, ధనరాజు సుహృద్వరు డివ్విధంబునన్
రాజిలు చుందువీవు నగరాజగృహా! నటరాజ! అంబికా
రాజ! త్రిలోక రాజ! సురరాణ్ణుత! శ్రీగిరి మల్లికార్జునా! 82.

హృదయము చంచలమ్ముకద! ఎంతటి యత్నము చేయుచుండినన్
కుదురదు, దాని నైజమొక కోతివలెన్ గను పట్టుచుండు, నా
కది యనుకూలమై యలరు నట్లుగ చేయవె వేగవేగ, నీ
పదయుగమున్ భజింతు సురవందిత! శ్రీగిరి మల్లికార్జునా! 83.

ఒక్క సగమ్ము జ్ఞానవిభవోన్నతమై యలరారు మేన, వే
రొక్క సగాన శక్తి వెలుగొంద, జగాలకు తల్లి దండ్రులై
మక్కువ నేక గాత్ర మహిమన్ చెలువొందెడు మిమ్ముజేరి, నే
మ్రొక్కెద జన్మ సార్ధకత పొందగ శ్రీగిరి మల్లికార్జునా! 84.

పూవులు, పండ్లు, పాయసము మున్నగు ద్రవ్యము లీయనేల? నీ
సేవలలో నిమగ్నమయి చెన్నగు మానస పంకజంబు సద్
భావముతో నొసంగు టుచితంబని నెమ్మనమందు నమ్ముదున్
దేవ! ఇదే నివేదనము నీకగు శ్రీగిరి మల్లికార్జునా! 85.

అరదము భూమి, చక్రయుగ మర్క శశాంకులు, నశ్వముల్ శ్రుతుల్
సరసిజ సూతి సారథియు, శైలము చాపము, పాము నారి, శ్రీ
హరి శరమైరి నీకు, త్రిపురాంతక! నీ విభవమ్ములెల్ల మా
కెరుగ దరంబె సర్వ భువనేశ్వర! శ్రీగిరి మల్లికార్జునా! 86.

పూవులలోని నారకును భూరి సుగంధము లబ్బునట్టు లో
దేవ! భవత్సమీప భువి తీర్థములందు చరాచరాళులెం
తే వెలుగొందు జ్ఞానమయ తేజముతో పలు సిద్ధులచ్చటన్
వావిరిగొన్న వంట వృషవాహన! శ్రీగిరి మల్లికార్జునా! 87.

ఈ జగమెల్ల నీ నిలయమేయగు సర్వ చరచరావళిన్
రాజిలుచుందు వీవు నగరాజ సుతాప్రియ! నాదు మానసాం
భోజమునందు నొప్పు నిను మోదము తోడ భజించుచుందునో

రాజకళాధరా! శివ! పరాత్పర! శ్రీగిరి మల్లికార్జునా! 88.

యోగివరుండవంచు మహితోన్నత శైలముపై వసింప బై
రాగిగ నేమి చిత్రమొ పరాత్పర! కోరి వరించెనంట ని
న్నాగిరిరాజ కన్య ప్రమథార్చిత! కామవినాశకా! శివా!
భోగివరేణ్య భూష! సురపూజిత! శ్రీగిరి మల్లికార్జునా! 89.

జీవితమేమి చెప్పుదును చింతలు వంతలు పెక్కు చిక్కులై
త్రోవయె లేకయుండు నతి దుర్గమమౌ గహనమ్ముపోలె, నా
కీ పెతలందు సాయమిక నీపె గదయ్య! భయమ్ము బాపి నన్
బ్రోవగదయ్య! నాగవర భూషణ! శ్రీగిరి మల్లికార్జునా! 90.

దురపిలుచుంటి నెంతయును దుఃఖమయంబగు లోకమందిటన్
కరవయె శాంతి సౌఖ్యములు, జ్ఞానము కోల్పడి నాడ, కామ ము
ఖ్యరిపుల చేత జిక్కితిని, కావవె నన్నిట పైరిజాలమున్
దరిమి, విముక్తి గూర్చి మదనాంతక! శ్రీగిరి మల్లికార్జునా! 91.

ఎంచితి భక్తి మార్గమె మహిమ్ సుగమమ్మని, దేవ! అట్లు భా
వించి భజించు చుంటి నిను పేడుక మీరగ, నీదు సేవచే
నించుక జ్ఞానసిద్ధి గని యివ్విధి సాగుచునుంటి నిన్నె ధ్యా
నించుచు, వేగ ప్రోవగదవే! నను శ్రీగిరి మల్లికార్జునా! 92.

మాటికి మాటికిన్ మది నుమాధవ! నిన్నె తలంచుచుండ నా
మాటలలోనె నీదు మహిమంబున పెల్వడు స్తోత్ర రత్నముల్
పాటల నాటలందు గను పట్టును నీపయి భక్తి భావముల్
హాటక గర్భ వందిత! మహాశివ!శ్రీగిరి మల్లికార్జునా! 93.

ఎరుగను యజ్ఞముల్ క్రతువు లెవ్వియునేని వ్రతాది దీక్షలే
నెరుగను యోగవిద్యలను నేనియు, సాధన చేయ బూనగా
నిరతము నీ పదాబ్జములనే హృదయాంబుజమందు నిల్పుచున్
స్మరణము చేయుచుందు, గిరిజా ప్రియ! శ్రీగిరి మల్లికార్జునా! 94.

మల్లెలు నీకు ప్రీతియని మాలలు దెచ్చును భక్తికోటి కో
కొల్లలుగా బళా! కుసుమ గుచ్ఛము గాకయె భక్తి తోడ నా
యుల్లము నీ కొసంగి నిను నొప్పుగ నర్చన చేయుచుండునన్
చల్లగ చూడు మెల్లపుడు శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 95.

కంటిని దేవ దేవ! త్రిజగత్పరిపూజిత! లోకమాత వా
ల్గంటిని, వామభాగమున గంటి, జగాలకు తల్లిదండ్రులై
జంటగ నొప్పు మిమ్ము భవసాగరమున్ దరియించ మీరె ది

క్కంటిని నన్ను గావుడు కృపాకర! శ్రీగిరి మల్లికార్జునా! 96.

హరహర! జన్మ దుఃఖతరమైనది జీవిత చక్రమన్న సం
బరముగ దోచుసేమొ తొలి మాయలలో దిగ జారుచున్న స
త్వరము వినాశమే కలుగు తథ్యము, కావున మోక్షమిచ్చి శం
కర! నను కావుమయ్య! త్రిజగన్నుత! శ్రీగిరి మల్లికార్జునా! 97.

హర! రిపు షట్కసంహర! హిమాలయ పర్వత నందినీ మనో
హర! విధి శక్ర ముఖ్య దివిజార్చిత పావన పాద! దైత్య సం
హర! వృషభాధివాహన! సుమాయుధ దర్ప హరా! శుభంకరా!
శరణము గోరుచుంటి నిను, శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 98.

కనులకు విందుగొల్పెడు నగమ్మట నీదు నివాస మీశ! స
జ్జనులు తదీయ శృంగమును సమ్మతి గాంచుట తోడనే వినా
శనమగు పాపముల్, మరల జన్మము గల్గదు, నిన్ను గొల్చి ము
క్తిని బడయంగ గోరుదు మదిన్ శివ! శ్రీగిరి మల్లికార్జునా! 99.

వ్రాలి నమస్కరింతును భవత్పద పంకజ యుగ్మ సన్నిధిన్
శైలసుతామనోహర! ప్రసన్న ముఖాంబుజ! చంద్రశేఖరా!
కాలమదాపహారి! నను గావుమటంచును వేడుచుంటి సె
క్కాలమునందు సంతత సుఖప్రద! శ్రీగిరి మల్లికార్జునా! 100.

మునుపటి జన్మలన్ గలుగు పున్నెము, పాపము మేళవించి గ
ల్గెను నరజన్మమిట్లని యెరింగితి వేరొక జన్మలేక ము
క్తిని బడయంగ గోరి నిను దీనదయాపరు నాశ్రయించితిన్
నను దరి జేర్చుమయ్య! కరుణన్ శివ! శ్రీగిరి మల్లికార్జునా! 101.

తిరుగగ నేల సెల్లెడల తీర్థములంచు ధరాధరాలు, సా
గరము లరణ్యముల్ నదులు గట్టులు పుట్టలు చెట్టులెన్నొ శం
కర! స్థిర భక్తి సాధనల గాంచగ వచ్చును నిన్ను భక్తు లం
దరు తమ మానసాబ్జముల తథ్యము శ్రీగిరి మల్లికార్జునా! 102.

మము ప్రియమార నీ చరణ మంగళ ధామము నందు జేర్చి భ
ద్రములను గూర్చు నాద సహితమ్ముగ మా కుపదేశమిచ్చి ధ్యా
నము కుదురంగ జేసి భవనాశము మోక్షపదమ్ము నీయుమా
భ్రమరవరా! జగద్గురు! పరాత్పర! శ్రీగిరి మల్లికార్జునా! 103.

భవ భవయంచు నే పలుక పాపములెల్ల నశింపకుండునే?
భవ భవయంచు నే పలుక బంధములెల్లను వీడకుండునే?
భవ భవయంచు నే పలుక ప్రాజ్ఞత శీఘ్రము కల్గకుండునే?

భవ భవయంచు సంతతము పల్కెద శ్రీగిరి మల్లికార్జునా! 104.

భ్రమర నికేతనంబనగ భాసిలు శ్రీనగ శృంగ సీమలో
మము జగదంబ ప్రోచుచును మంగళముల్ సమకూర్చు చుండగా
భ్రమలు తొలంగు మనసము భాసిలు జ్ఞానమయ ప్రదీప్తితో
సుమహిత యొుగదా! భ్రమ సుందర! శ్రీగిరి మల్లికార్జునా! 105.

హరహరయంచు నీ పదములంటి భజింప భయాలు బాయవే?
హరహరయంచు నీ పదములంటి భజింప నఘాలు మాయవే?
హరహరయంచు నీ పదములంటి భజింపగ ముక్తి కల్గదే?
హరహరయంచు నీ పదములంటెద శ్రీగిరి మల్లికార్జునా! 106.

జయ జయ కామ దర్పహర! సర్వ శుభంకర! దుఃఖనాశకా!
జయ జయ భక్త పాప హర! సజ్జన పోషక! దోషనాశకా!
జయ జయ శూల ఢక్కధర! సాధు జనార్తి హరా! పురాంతకా!
జయ జయ దేవ దేవ! శివ! శంకర! శ్రీగిరి మల్లికార్జునా! 107.

జయ జయ నాగ చర్మ ధర! శైలవరాలయ! నీలకంధరా!
జయ జయ నందివాహన! భుజంగ వరేణ్య విభూషణా! హరా!
జయ జయ మల్లికా కుసుమ చారు విభూషిత గాత్ర! శంకరా!
జయ జయ దేవ దేవ! ముని సన్నుత! శ్రీగిరి మల్లికార్జునా! 108.

ఓం తత్ సత్

# సరస్వతీ స్తోత్రము

శ్రీసరోరుహ గర్భ సంభవు జిహ్వా లాలిత రత్న సిం
హాసనమ్ముగ నొప్పు దేవత! హంసవాహన! భారతీ!
భాసమాన యశోన్వితా! నిను ప్రస్తుతించెద సర్వదా
వాసవాది సురాళివందిత! వందనమ్ము సరస్వతీ!

సకల వేద పురాణ శాస్త్ర రస ప్రసార వినోదినీ!
సుకవి పండిత వర్య వందిత శుద్ధ కీర్తి సమన్వితా!
శుక విరాజిత పాణి పల్లవ శోభితా! భువనేశ్వరీ!
ప్రకట వాగ్విభవ ప్రదాయిని! వందనమ్ము సరస్వతీ!

మల్లె లంచలు కప్పురమ్ముల మంచి చాయల నొప్పుచున్
చల్లనౌ కనుచూపు తోడుత చల్లుచున్ కృప మాయెడన్
తల్లి మమ్ముల బ్రోచుచుందువు తమ్మిచూలికి డెందమున్
పల్లవింపగ చేయు కోమలి వందనమ్ము సరస్వతీ!

సరస మంజుల సత్ఫలప్రద సత్య సూక్తులు సన్మతిన్
నిరతమున్ పలికించి ప్రోతువు నీవు మమ్ముల ప్రేమతో
పరమ భక్తి విశేష మానస పంకజమ్మున వేడుదున్
పరమ విద్య ననుగ్రహింపుము వందనమ్ము సరస్వతీ!

వీణ మీటుచు వేదనాదము విశ్వమంతట నింపు గీ
ర్వాణి! మంజుల భాషిణీ! ప్రియ వాగ్విభూషణ తోషిణీ!
క్షోణి నౌదల జేర్చి నిన్ను విశుద్ధ భక్తి దలంచుచున్
పాణి యుగ్మము మోడ్చి చేయుదు వందనమ్ము సరస్వతీ!

ఓం తత్ సత్

# అన్నపూర్ణా స్తవము

కన్నతల్లివి భక్తకోటికి కల్పవల్లివి తల్లి! మా
విన్నపమ్ముల నాలకింపుము విశ్వనాథ మనోహరీ!
నన్ను బ్రోవుము సర్వ దుఃఖ వినాశినీ! సుఖ దాయినీ!
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 1.

అన్నమే తగు తృప్తి నిచ్చుచు నార్తి దీర్చును లెస్సగా
అన్ని ప్రాణులకిచ్చు శక్తిని హాయి గూర్చును శ్రేష్ఠమౌ
అన్నమే సుగుణాలు పెంపలరార జేయునటంచు నో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 2.

కన్నులందు సుధారసమ్ము ముఖమ్ములోన మహాద్యుతుల్
వెన్నెలల్ దరహాసమందున వెల్గుచుండెడు తల్లి! ని
న్నెన్నడెన్నడు జూతునోయని నే దలంచుచు మెండుగా
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 3.

ఉన్నతాచల శృంగ సీమ మహోజ్జ్వలాద్భుత మూర్తివై
కన్నువిందొనరించు చుందువు కాంచనాంబుజ సంస్థితా!
నిన్ను ధ్యాన మొనర్చుచుందును నీలకంధర గేహినీ!
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 4.

సన్నయమ్ముగ నాటలాడుచు షణ్ముఖుండు గజాస్యుడున్
నిన్ను ప్రేముడి గొల్చుచుండగ నెమ్మనమ్మున నిన్ను నే
సన్నుతించుచు గూర్చి ఇచ్చుచు సత్కవిత్వ సుమాళినో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 5.

అన్ని ప్రాణులకిచ్చు చుండెద వన్ని రీతుల నోగిరం
బన్నివేళల తృప్తిదీర సమాదరమ్మున నవ్విధం
బెన్న మా తరమా జగమ్ములకెల్ల పోషిణివీవెగా
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 6.

సన్నయమున కాశిలో నొక సత్రమున్ నెలకొల్పి యం
దన్నదానము చేయుచుండెద వర్థికోటికి నిత్యమా
యన్నమే యమృతంబునై యిడు నక్షయోన్నతులొప్పుగా
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 7.

అన్ని బాధలు తీరు నీకృప నన్ని వ్యాధులు నాశమౌ
నన్ని తాపములున్ హరించు ననంత సౌఖ్యములబ్బునో
సన్నుతామల కీర్తి శాలిని! సర్వమంగళ! యంచునే

అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 8.

మున్ను శిష్యులతోడ వ్యాసుడు భుక్తి లేక నలుంగుచున్
కన్నులెఱ్ఱగ జేయ వారల కష్టముల్ తొలగించి మృ
ష్టాన్న తృప్తులగా నొనర్చితి వాదరమ్మున కాశిలో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 9.

అన్నమే పరమౌషధంబగు నన్నమే యమృతోపమౌ
నన్నమే రసపుష్టి గూర్చు నటంచు భావన సేసిసే
నన్నమున్ గొనుచుందు నీదు మహాప్రసాదముగ సదా
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 10.

ఎన్న వచ్చునె నీదు లీలలు నీశు లీలలు చిత్రముల్
మున్ను శంభుడె నీదు ముంగిట భుక్తిగోరుచు నిల్వగా
యన్న మిచ్చితివమ్మ! స్వామికి నక్షయమ్ముగనంచు నో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 11.

వెన్నవంటిది నీ మనమ్మని ప్రేమమూర్తివి నీవు నీ
సన్నిధానమునందు నిత్యము శాంతి సౌఖ్యములిచ్చి మ
మ్మన్ని రీతుల బ్రోచుచుండెడు నమ్మవీవని నమ్మియో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 12.

అన్ని దానములందు నొప్పుగ నన్నదానమె మేలు, నీ
సన్నిధానమె పావనంబగు స్థాన మెల్లెడలందు, నా
పన్నలోక శరణ్య నీదు కృపా విశేషము గోరి యో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 13.

ఉన్నదానవు భక్తకోటుల నుద్ధరించు సదాశయం
బున్నదానవు విశ్వనాథుని కొప్పుగా సగభాగమై
యున్నదానవు మన్మనంబున నున్నదానవటంచు నో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 14.

అన్నమే యొనరించు సృష్టిని, అన్నమే స్థితి కారణం
బన్నమే లయకారణంబని యన్నమున్ వినుతింతురా
యన్నమందలి లక్షణమ్ముల నన్ని పేర్కొన నౌనె మా
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 15.

అన్నమే తొలి యక్కరౌగద అన్ని ప్రాణులకున్ భువిన్
అన్నమే కరవైన అన్యములన్ని వ్యర్థములేకదా!
అన్నమిచ్చి సుఖింపజేసెద వన్ని ప్రాణుల నీవెగా

అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 16.

కన్నులందున దివ్య కాంతులు, కాంతులందు సుధారసం
బున్నదో జగదంబ! నీకదె యొప్పుగా భువనంబులం
దున్న జీవుల నెల్ల పెంచుచునుండు నో శఫరేక్షణా!
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 17.

నన్ను చల్లగ చూడుమా కరుణా రసాంచిత వీక్షణల్
చెన్నుగా ప్రసరింప జేయుచు స్నిగ్ధ హాస విలాసినీ!
చిన్నిధానము నీ పదాంబుజ సీమయంచు నెరింగి యో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 18.

ఉన్నవెన్నియో పథమ్ములు యోగ విద్యలటంచునే
నెన్నజాలక యెట్టి మార్గమునేని నీ కృప తోడనే
నిన్ను జేరగ నెంచి నెమ్మది నిన్ను వేడుచునుండి యో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 19.

తిన్ననిన్ బలె భక్తిలేదు, సుధీవికాసము లేదు నిన్
సన్నుతించు విధంబెరుంగను సత్పథంబెరుగన్ జుమీ
నన్ను బ్రోచెడు దానవీవని నమ్మకమ్ము చెలంగగా
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 20.

వెన్ను సోదరి వీవు నిత్యము విశ్వమందు మహౌషధుల్
చెన్నుగా రసపుష్టి నొందగ చేసెదైందవమూర్తివై
వెన్నెలల్ పరమార్థ దీప్తుల విందు జేయును మాకునో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 21.

నిన్ను బ్రహ్మముగా దలంతును నీవె నిత్యము సత్యమున్
చెన్నుగా భువనాళి నెల్ల సృజించి క్రీడల తేలెదో
చిన్నిధానమ! నాదు చేష్టలు చిత్రమౌ కద నీకునో
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 22.

మున్ను హాలహలమ్ముమ్రింగెను ముజ్జగంబుల బ్రోవ న
త్యున్నతాశయ మూర్తి శంకరుడొప్పు మీరగ నీదు కన్
సన్నలగని యో సుమంగలి! సర్వలోక శుభంకరీ!
అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 23.

ఉన్నవెన్నియునో సరోజములొప్పుగా కుల మార్గమం
దన్నిటన్ విహరించు చుండెద వమ్మ! పెక్కు విధాలుగా
నిన్ను ధ్యానమొనర్చి పొందెద నిత్య సౌఖ్యము లంచునో

అన్నపూర్ణ భవాని! నీ పద మాశ్రయించితి భక్తితో 24.

ఓం తత్ సత్